VIGNANA KANTHI PUNJAMULU (Telugu)



★ సశాస్త్రీయ - సప్రమాణ, విజ్ఞాన కాంతి పుంజములు ' కలవు !

**రచయిత పరిచయము :**




పేరు : దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు

జననీజనకులు : లక్ష్మీతాయారమ్మ - యోగానందాచార్యులు గార్లు

జనన తిథి : స్వస్తిః శ్రీ అంగిరస ఫాల్గుణ కృష్ణ సప్తమీస్థిరవారము

జన్మస్థలము : శ్రీరంగపురము (తెనాలి వద్ద)

వృత్తి : పరంపరాగతమైన శ్రీపాంచరాత్ర దివ్యాగమ శాస్త్రప్రకారము భగవదర్చన;వైద్యము; శ్రీపాంచరాత్ర దివ్యాగమ గ్రంథరచన. దేవాలయ - మానవ గృహ వాస్తులు : ముహూర్త నిర్ణయం మొదలగునవి.

ప్రస్తుత నివాసము : గుంటూరు - చౌత్రాయందలి శ్రీసీతా సహిత కోదండ రామ చంద్రస్వామి వారి ఆలయము.



Printed at OMKARS, Gnt. Ph.232653


శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః



# విజ్ఞాన కాంతి పుంజములు






రచయిత

'శ్రీపాంచరాత్ర సేవక'

శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు



ప్రచురణ :

డా. దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు

**శ్రీ పాంచరాత్ర దివ్యాగమ పరిషత్**

లాలాపేట, గుంటూరు-522 003.

**1997.**

## అంకితము

శ్రీ కాంచీ కామ.కోటి జగద్గురు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామివారిచే 'దైవజ్ఞ చింతామణీ' బిరుదమును గ్రహించి మహోన్నత శాస్త్రపాండితీధిషణ గలిగి, ఆంధ్ర దైవజ్ఞలోక దివాకరుడన బరగిన దృక్సిద్ధ పంచాంగకర్త బ్రహ్మ శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రి గారి దివ్య శ్రీపాద పద్మయుగళి యందు అత్యంతనమ్రశిరస్కుడనై భక్తితో సమర్పించు చూవున్నాను.

శ్రీ ధాతృ కార్తిక శుక్ల ఏకాదశీ
గురువారం
క్రీ.శ.21.10.1996

ఇట్లు,
భగవచ్చరణదాసుడు,
దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు

---



## పాఠకులకు విజప్తి



క్రీ.శ 1965 సంవత్సరము నుండి యూ ఇప్పటి వఱకూ ఎనిమిది గ్రంథములు శ్రీపాంచరాత్ర దివ్యాగమ శాస్త్ర అను సారము సప్రమాణముగా జనులు విజ్ఞానవంతులగుట కొఱకు రచన చేసివున్నాను! కొన్ని గ్రంథములు ఆంధ్ర - తమిళనాడు - కర్నాట - మహారాష్ట్ర - ఒరిస్సా రాష్ట్రములలో వుండిన పండితులు - యూనివర్శిటీ ఫిలాసఫీ ప్రొఫెసర్‌ల మెప్పును పొందియున్నవి. అందు వలన నా జన్మ చరితార్థమైనదని తలంచుచూవున్నాను. దీనిని ఆమూలాగ్రముగా చదివి మీ అమూల్య అభిప్రాయములను తెలుపకోరుచూ వున్నాను!

★ దృక్ గణిత పంచాంగములునూ, కేలెండర్లునూ శాస్త్రబద్ధమైనవి! కావున వానిని కొని ఉపయోగించి సత్ ఫలితములను తప్పక పొందవలసినదిగా మరీ - మరీ ప్రార్థించుచూ వున్నాను.

వెల : రూపాయలు

--ది.ల.న.

హరిః ఓమ్

# ॐ 'ఓమ్' కార రహస్యము ॐ

1. ఓ మిత్యేకాక్షరమ్ బ్రహ్మ.
పరమాత్మ తత్త్వమును అక్షర రూపములో తెలియ చేయాలంటే - అదే 'ఓమ్' అను ఒకే ఒక అక్షరము!

2. హరిః ఓమ్!
ఓంకార స్వరూపుడు హరి

3. ఓమ్ భూః = భూ లోకము ఓంకార స్వరూపము!
ఓమ్ భువః = భువర్ లోకము ఓంకార స్వరూపము!
ఓమ్ సువః (స్వః) = స్వర్లోకము (స్వర్గము) ఓంకార స్వరూపము!
ఓమ్ మహః = మహర్లోకము ఓంకార స్వరూపము!
ఓమ్ జనః = జనోలోకము ఓంకార స్వరూపము!
ఓమ్ తపః= తపోలోకము ఓంకార స్వరూపము!
ఓమ్ సత్యమ్ = సత్య (బ్రహ్మ) లోకము ఓంకార స్వరూపము!
ఓమ్ తత్ సర్వమ్ = అనగా : సర్వలోకములున్నూ, సర్వదేవతలున్నూ ఓంకార స్వరూపులై వున్నారు! (ఇది గాయత్రీ మంత్రము)

4. మన్త్ర పుష్పము నందు -
అ) ఓమ్ తద్బ్రహ్మ = బ్రహ్మ ఓంకార స్వరూపుడు!
ఆ) ఓమ్ తద్వాయుః = వాయువు ఓంకా స్వరూపుడు!
ఇ) ఓమ్ తదాత్మా = ఆత్మ స్వరూపము ఓంకారమే!
(ఆత్మ ఓంకార స్వరూపము)
ఈ) ఓమ్ తత్సత్యమ్ = సత్యము ఓంకార స్వరూపము!
ఉ) ఓమ్ తత్ సర్వమ్ = సర్వమునూ ఓంకార స్వరూపము!
ఊ) ఓమ్ తత్ పురోమ్ నమః = సర్వకారణ స్వరూపము ఓంకారమే

5. పతంజలి యోగ శాస్త్రము నందు -

'తస్య వాచకః ప్రణవః' ఓంకారమే పరమాత్మను తెలుపునది!

6. ఓంకారమునకు గల ఇతర నామములు -

1. ఓంకారము 2 ప్రణవము 3 ఉద్గీథము 4 తారము

7. మంత్ర జపము 3 విధములు; వాని ఫలితములు

1 ప్లుతము, 2 ఉపాంశువు, 3 దీర్ఘము

అ) ప్లుతము : ఇది మానసిక జపము దీనిని జపించునపుడు శబ్దము బయటకు వినుపింపదు; పెదవులునూ కదలవు : ఇది సర్వశ్రేష్ఠము!

ఆ) ఉపాంశువు : ఇది మంద్రస్థాయిలో ప్రక్కనున్న వారికి మాత్రమే వినుబడు నట్లు చేయు జపము! ఇది మధ్యమ ఫలితమును యిచ్చును.

ఇ) దీర్ఘము: బిగ్గఅగా అందరకునూ వినుపించునట్లు చేయు జపము: ఇది అధమ ఫలమును ఇచ్చును.

దీనికి ఆధారము:- పద్మ పురాణము

శ్లో. యావజ్జీవ జపే న్మన్త్రః ప్రణవం బ్రహ్మణో వపుః,
'హ్రస్వో' దహతి పాపాని 'దీర్ఘ' శాన్తి ప్రదాయకః.
'ప్లుత'స్తు సర్వసిద్ధి స్స్యా త్ప్రణవ స్త్రివిధః స్మృతః,

తా. మానవుడు (స్త్రీ, పురుషులు) బ్రదికి వుండినంత వఅకునూ, రేయింబవళ్లునూ ప్రణనము విధిగా జపింపవలసినదే; ప్రణవ జపము మూడు తెఅగులు!

1. ప్లుతము = సర్వసిద్ధులను కల్పించును!
2. హ్రస్వము (ఉపాంశువు) = పాపములకు నశింప చేయును!
3. దీర్ఘము = శాన్తిని చేకూర్చును. పరబ్రహ్మకు శరీరము ప్రణవము! మానవుడు జీవించి వుండినంత వరకునూ విడువక జపింపవలెను!





8. వైష్ణవ మూల మన్త్రములు : నాలుగు

'ఓమ్' కారము (ఏకాక్షరీ)
'ఓమ్ నమో విష్ణవే' (షడక్షరీ)
'ఓమ్ నమో నారాయణాయ (అష్టాక్షరీ)
'ఓమ్ నమో భగవతే వాసుదేవాయ' (ద్వాదశాక్షరీ)

ఈ విషయము: పాద్మ; విష్ణు తిలక సంహితల యందు చెప్పబడినవి.

9. మాండూక్య ఉపనిషత్తు -

ఓ మిత్యేదక్షర మిదం సర్వం తస్యోఽప వ్యాఖ్యానం,
భూత - భవ భవిష్య దితి సర్వ మోంకార ఏవం,
యచ్చాన్యత్ త్రికాలాఽతీత దప్యోంకార ఏవమ్.

తా. ఓంకారమును అను ఒకే ఒక అక్షరము. సర్వ సృష్టికినీ మూలమైనది! జరిగినది - జరుగుచున్నది - జరుగబోవునది, అంతయు ఓంకారము నందు అంతర్భూతము! త్రికాలములకు (భూత - భవిష్య - వర్తమానములకు) కూడా కట్టుబడని పరతత్త్వము ఏది కలదో - అది అంతయును ఓంకారమే!

10. భగవద్గీత యందు శ్రీకృష్ణ పరమాత్మ -

శ్లో. ఓ మిత్యేకాఽక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజే ద్దేహం సయాతి పరమాంగతిమ్.

తా. అంత్యకాలమున, పరబ్రహ్మ రూపమగు ఓంకారము ఉచ్చరించుచూ, నన్ను మనసున తలచుకొనిన ఏ జీవి ఐననూ, ఇహలోకమునందు గల పాంచభౌతిక మగు దేహమును వదలి పరమగతి అగు (నా లోకమును) నన్ను తప్పక చేరుకొందురు.

11. శ్లో. ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం,
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.

తా. ఆకాశము (మేఘము) నుండి జారిపడి నీటి బిందువులు సన్నని నీటి జాళ్లుగా, వాగులుగా, ఏఱులుగా మారి, కడలియందు ఎట్లు కలియుచున్నవో - అట్లే - దేవతలందరికీ చేసిన పూజలు - నమస్కారములు అన్నియూ, విష్ణువునకు చేరి, ఉత్తమ ఫలములను ఒసగుచున్నవి!

12. శ్లో. తస్మా 'దో' మి త్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః,
ప్రవర్తన్తే విధానోzక్తాః సతతః బ్రహ్మ వాదినామ్.

తా. బ్రహ్మవాదులైనవారు ఓంకారమును మొట్టమొదటగా పలికి చేయునటువంటి యజ్ఞము; దానము; తపము; సర్వవిధములగు పనులు విధిగా ఆచరించెదరు.

13. శ్లో. మంత్ర మధ్యే క్రియా మధ్యే విష్ణోః స్మరణపూర్వకమ్.
యత్ కించ క్రియతే కర్మ తత్కోటి గుణితం భవేత్.

తా. మంత్రము ఉచ్చరించునపుడు గానీ, పనులు చేయునపుడు గానీ, (సర్వకాల, సర్వ అవస్థల యందునూ) విష్ణువును తలచుకొని చేసిన యెడల ఏ కొంచెము చేసిననూ కోట్ల రెట్లు ఫలితము అభివృద్ధి చెంది భగవత్ కటాక్షము శాశ్వతముగా కలుగును!

14. గీతయందు శ్రీకృష్ణపరమాత్మ -
'అక్షరాణాం 'అ' కారోz స్మి

తా. అక్షరము అనగా నాశనము లేనిది అని అర్థము! 'అ' అను అక్షరము నుండి 'క్ష' అను అక్షరము వరకునూ ఉండిన అక్షరములలో ప్రప్రథమ అక్షరమగు 'అ' అను అక్షరమును నేను.!



శ్రీమాన్ దిట్టకవి. లక్ష్మీనరసింహాచార్యులు వ్రాసిన -- విజ్ఞాన కాంతి పుంజములు

(మన అక్షరముల విశిష్టత మహోన్నతమైనది. 'అ' మొదలు 'క్ష' వరకునూ ఉండిన లిపి సంకేతములకు అక్షరములని మన పూర్వులు పేరు పెట్టుట వారి అమోఘ వివేచనా శక్తికి నిదర్శనము'.

ఇతర జాతుల లిపులకు ఇంత ఉత్తమ నామము లేదు - ఉదాహరణకు ఆంగ్లములో ALFA BETHS (ఆల్ఫాబెత్స్) అని పేరు. వారి వర్ణమాల బాబిలోనియా సంస్కృతి నుండి వచ్చినది వారి మొదటి అక్షరము 'అలెఫ్' అనగా ఎద్దు! 'బెత్' అనగా ఇల్లు! అనగా వారి పరిసరముల మీద ఆధార పడి, వారి వర్ణమాల స్థిరపడినది! మనకు అక్షరము - పరమాత్మ స్వరూపము'!)

15. ఓంకారమునందు అ - ఉ - మ అను మూడు అక్షరములు కలసి వున్నవి. 'అ' పరమాత్మ విష్ణువు! 'ఉ' పురుషకార స్వరూపిణి లక్ష్మి! 'మ' జీవుడు!

జీవుడు పురుష కార స్వరూపిణి అయిన లక్ష్మీదేవిని (తల్లిని) ఆశ్రయించి నారాయణుని (తండ్రిని) చేరి తరించవలెను! (వ్రాసినతేదీ 30.4.1995)

## ❄ సాలగ్రామ అర్చనా ఫలము ❄

శ్రీ భవిష్యోఽత్తర పురాణే, గండకీ శిలా మహాత్మ్యే -

శ్లో. ఖండితాః స్ఫుటితా భిన్నా అగ్నిదగ్ధా స్తథైవ చ,
సాలగ్రామ శిలా యత్ర; తత్ర దోషో న విద్యతే. .౧.

తా. శ్రీ భవిష్యోత్తర పురాణమునందలి గండకీ శిలా మహాత్మ్యములో - సాలగ్రామ శిల పగిలిననూ, గట్టిగా వుండిననూ, విఱిగిపోయిన ముక్కఐననూ, అగ్నియందు కాలిననూ (అనగా - వీనిలో ఏ ఒక రూపములో వుండిననూ) ఏ దోషమునూ లేదు। ఆ సాలగ్రామమును పూజింపవచ్చును।

శ్లో. నమంత్ర ః పూజనం చైవ న తీర్థం, నచ భావనా,
న స్తుతి ర్నోఽపచార శ్చ సాలగ్రామ శిలాఽర్చనే. .౨.

తా. సాలగ్రామ శిలను అర్చించు వారికి - మంత్రము తెలియకపోయిననూ, పూజించు విధానము తెలియకపోయిననూ; పుణ్య తీర్థములయందు స్నానములు చేయకపోయిననూ; మనసున ధ్యానించుట చేతకాక పోయిననూ; స్తుతి, పదునాఱు ఉపచారములు చేయుట తెలియకున్ననూ, సాలగ్రామము నందు సదాసన్నిహితుడైన శ్రీ హరి (కేవలము నమస్కరించినచో) ప్రసన్నుడగును!

శ్లో. బ్రహ్మ హత్యాఽదికం పాపం మనో వాక్ కాయ సంభవమ్,
శీఘ్రం నశ్యతి తత్సర్వం సాలగ్రామ శిలార్చనాత్. .౩.

తా. సాలగ్రామ శిలను పూజించినందువలన - బ్రహ్మహత్యమున్నగు పాపములునూ, మనసు - మాట - శరీరముల చేత చేసిన పాపములునూ అవి అన్నియునూ వెనువెంటనే నశించిపోవును!





## ❄ శ్రీ విష్ణు పాద తీర్థ మహిమా ❄

శ్లో. అజన్మ కృత పాపానాం ప్రాయశ్చితం చ ఇచ్ఛతి,
సాలగ్రామ శిలా వారి! పాపహారి। నమోఽస్తు। తే।.౧.

తా. అనేక జన్మలలో చేసిన పాపకృత్యములు నశింపు చేసికొనుటకు ఏ జీవులు కోరుకొందురో - వారు 'సాలగ్రామశిలకు స్నానము చేయబడిన ఓ। పవిత్రజలమా। పాపవిమోచనము చేయు తీర్థమా। నీకు నమస్కారము! అని శిరము వంచి చేతులు మోడ్పవలెను!

శ్లో. అకాల మృత్యు హరణం సర్వవ్యాధి (నివారణమ్) వినాశనమ్,
విష్ణు పాదోఽదకం పీత్వా శిరసా ధారయామ్యహమ్..౨.

తా. అకాల మృత్యువును హరించుదానినీ, సర్వవ్యాధులను వినాశన మొనర్చుదానిని, శ్రీ విష్ణుపాదోదకమును త్రావి, నేను (మిగిలిన తడిని) నడి శిరమున ధరించుచూ వున్నాను!

శ్లో. శంఖ మధ్యే స్థితం తోయం భ్రామితం కేశవోఽపరి,
అంగలగ్నం మనుష్యాణాం బ్రహ్మహత్యాదికం దహేత్..౩.

తా. శ్రీమన్నారాయణుని అర్చనా సమయము నందు పూజించువారు (దక్షిణావృత్త) శంఖ మధ్యమున ఉండిన నీటితో భగవన్మూర్తికి చుట్టునూ త్రిప్పి భగవద్ బింబమునందలి సర్వాంగముల యందునూ మనసు నిలిపిన మానవులు ఎవరు వుందురో - అట్టివారు బ్రహ్మ హత్య మున్నగు పాపములు చేసిననూ అవి దహనమై పోవును!

శ్లో. స్నానోఽదకం పిబే న్నిత్యం సాలగ్రామ శిలోఽద్భవమ్,
ప్రక్షాళ్య ఇతి తత్తోయం బ్రహ్మ హత్యాం వ్యపోహ్యతి..౪.

తా. సాలగ్రామ శిలను కడిగి (పురుషసూక్తము మున్నగు మంత్రములతో) స్నానము చేయించిన జలమును ప్రతిదినమునూ ఎవరు త్రాగుదురో, వారికి బ్రహ్మ హత్యా దోషములు నశించును!

శ్లో. విష్ణోః పాదోఽదకం పీత్వా కోటి జన్మాఽఘ నాశనమ్,
తస్మా దష్టగుణం పాపం భూమౌ బిందు నిపాతనాత్..॥.

తా. విష్ణుపాదజలమును త్రాగినచో కోటి జన్మల యందు చేసిన పాతకము (కూడా) నశించును! (కానీ) దానిలోని ఒక బిందువు ఐననూ నేలపై పడినచో - ఎనిమిది కోట్ల జన్మల యందు చేసిన పాపములు జీవులను ఆక్రమించును!

## ❄ శ్రీ విష్ణుపాద తీర్థ విషయమ్ ❄

1. ప్రశ్న : తీర్థము అనగా నేమి ?

సమాధానము: పురుషసూక్తము మొదలైన (పంచసూక్త) మంత్రములతో శ్రీ విష్ణు స్వరూపమగు సాలగ్రామ శిలకు స్నానము చేయించిన జలమునూ; అర్ఘ్య - పాద్య - ఆచమనములు భగవానునకు పూజచేయువేళ సమర్పించి తరువాత ఆజలమును 'పతత్ గ్రహ పాత్ర' యందు వుంచి, స్నపనము చేసిన జలము కూడా కలిపి (తులసీదళ సహితమై - పవిత్రమునూ, పాపహరమునూ అగు నీరము తీర్థము అనబడును!) ఈ తీర్థమును అర్చన ఐన వెంటనే - మునువ్వందుగా అర్చక స్వామి తీసికొని తరువాత, తన్మయులైన వారికినీ; సన్యసించిన వారికినీ; అధ్యాపకులకునూ యజమానులగు ధర్మకర్తలకునూ; తక్కిన భక్తులకునూ వరుసగా యివ్వవలయును !





★ అర్చక స్వామి కానీ, స్వామిని ఇంటి యందు పూజించిన వారు కానీ అర్చన పూర్తికాగానే తీర్థమునూ; ప్రసాదమునూ మున్ముందుగా తీసికొనక పోయినచో ఆ పూజ అంతయును నిష్ఫలము అగును!

2. ప్ర: తీర్థమును ఏ మంత్రముతో - ఎన్నిమారులు తీసికొనవలెను?

స: ఉత్తరీయమును మగవారునూ; పైట చెఱగును ఆడవారునూ రెండు మడతలు వేసి. అనగా నాలుగు పొరలు వచ్చునట్లుగా మడిచి ఎడమ చేతి యందు పెట్టుకొని, కుడి చేతిని ఆగుడ్డ మడతపై పెట్టి, చూపుడు వ్రేలును క్రిందికి దించి, దానికి పైగా (చూపుడు వ్రేలు ఏ మాత్రమూ తగులకుండా) బ్రొటనవ్రేలును నడిమి వ్రేలి క్రింద కణుపునకు పెట్టి గట్టిగా నొక్కి మినుప గింజమునుగునంత తీర్థమును విడి - విడిగా - 'ఓమ్ అచ్యుతాయనమః, 'ఓమ్' అనన్తాయ నమః'; 'ఓమ్ గోవిన్దాయ నమః' అను 'నామత్రయ మన్త్రము' తో ఒక చుక్క తీర్థమైననూ నేలపై పడనీయక వినమ్ర శిరస్కులై శ్రద్ధా భక్తులతో స్వీకరింపవలయును!

3. ప్ర: 'నా మత్రయ మంత్రము' అనగానేమి ? దానిని ఎవరు చెప్పిరి?
అమంత్రముతో తీర్థము తీసికొనిన ఏమి ఫలము కలుగును?

స: ౧ ఓమ్ అచ్యుతాయ నమః
౨ ఓమ్ అనన్తాయ నమః
3 ఓమ్ గోవిన్దాయ నమః

ఈ మూడింటికినీ నామత్రయ మంత్రము అని పేరు! దీనిని శ్రీ నారద మహర్షి తెలిపెను!

శ్లో. అచ్యుతః కల్పవృక్షశ్చ; అనన్తః కామధేనవః,
చిన్తామణిస్తు గోవిన్దో, నామత్రయ ముదీరితమ్.
నామత్రయ మన్త్రేణ త్రిః పిబే ద్భిం ద్వ వర్జితమ్. ౧

తా. ఓమ్ అచ్యుతాయనమః అను మంత్రముతో మొదటి సా తీర్థము తీసికొనినచో - భక్త కల్పవృక్షము అగు శ్రియఃపతి భక్తుని కాపా విడువక రక్షించును! తీర్థము తీసికొనినచో - భక్తుల పాలిటి కామధేనువు ఐన శ్రీ మన్నారాయణుడు కోరికలను నిశ్శేషముగా తీర్చును ! 3 ఓమ్ గోవిందాయ నమః అను మంత్రముతో మూడవసారి భక్తుడు తీర్థము తీసికొనినచో - శ్రీహరి సర్వకాల సర్వావస్థల యందును ఆభక్తుని తన వానిగా చేసికొనును!

*విశేష వివరణ:

1 దేవతల చెట్టు = కల్పవృక్షము !

2 దేవతల ఆవు = కామధేనువు !

3 దేవతల రత్నము = చింతామణి !

వీనిలో - ఒక్కొక్కటియే, మానవులు కోరిన కోర్కెలు అన్నింటినీ సంపూర్ణముగా నెఱవేర్పగలిగిన సామర్థ్యము గలవి! అటు వంటి అప్పుడు - భక్తకల్ప వృక్షము; భక్త కామధేనువు; భక్త చింతామణి అగు శ్రీనాథుని తలచుచూ తీర్థ స్వీకరణము చేసిన భక్తులకు మఱుజన్మము లేదు!

4 ప్ర: తీర్థము మూడుమారులే ఎందుకు తీసికొనవలెను ?

స: శ్లో. ప్రథమం దేహ శుద్ధ్యర్థం; ద్వితీయ మాత్మ శుద్ధికమ్,
తృతీయం మోక్ష సిద్ధ్యర్థం సాలగ్రామ జలం పిబేత్. ౨
(ధర్మప్రవృత్తి)





తా. 'ఓమ్ అచ్యుతాయ నమః' అని మొదటి సారి తీర్థమును భక్తుడు తీసికొనినచో - అతని దేహము పవిత్రము అగును !

'ఓమ్ అనంతాయ నమః' అని రెండవసారి తీర్థమును భక్తుడు తీసికొనినచో - అతని ఆత్మపవిత్రము అగును!

'ఓమ్ గోవిందాయనమః' అని మూడవసారి తీర్థమును భక్తుడు తీసికొనినచో - అతనికి మోక్షమునకు యోగ్యతలభించును! శ్రీ మన్నారాయణుని అనుగ్రహము వలన స్త్రీ - బాల - వృద్ధులకు అందరునూ విధిగా ముమ్మాఱు శ్రద్ధా భక్తులతో తీర్థ పరిగ్రహణము చేయవలెను!

★ తీర్థమును 'జుఱ్ఱి' కూడదు! శబ్దమువచ్చునట్లుగా తీర్థమును త్రావినచో - గాడిదగా కానీ, గుఱ్ఱముగా కానీ మరుజన్మలో పుట్టుదురు !

5 ప్ర: తీర్థమును త్రావి మిగిలిన తడిని నడినెత్తిన (బ్రహ్మరంధ్రము నందు) పెట్టుకొనవచ్చునా ?

స: తప్పక పెట్టుకొని తీరవలెను (ఆధార ప్రమాణ గ్రంథము - శాండిల్య సంహితా)

శ్లో. సాలగ్రామ శిలాతీర్థం పేయః జీవైర్దినే దినే,
చుళుకేన పిబే త్తీర్థం; శేషం శిర్ష్ణి సమాఽవహేత్. 3

తా. శ్రీ మన్నారాయణ స్వరూపమగు సాలగ్రామ శిలకు స్నానము ఆడించిన (పవిత్ర) జలమును జీవులు ప్రతిదినమునూ - 'గోకర్ణా కృతి హస్తము'తో త్రాగవలయును! మిగిలిన జలమును నడిశిరమున ధరింపవలెను !

## ❄ తీర్థమును ఎట్లు తీసికొనవలెను ? ❄

6 ప్ర: తీర్థగ్రహణము ఎట్లు ?

స: (ఆధార ప్రమాణ గ్రంథము పేరు తెలియదు)

శ్లో. జపే, చౌషధ, హోమేచాzచామే, దన్తధావనే,
తర్జనీం వర్జయే ధీమాన్ విధినా పంచకర్మ సు. ౪

తా. ౧ జపము చేయునపుడు జపమాలకునూ;
౨ ఔషధము తీసికొనునపుడు మందుకునూ -
౩ హోమము చేయునపుడు 'చరు' పదార్థమునకునూ-
౪ ఆచమనము చేయునపుడు జలమునకునూ -
౫ పళ్ళుతోముకొను సమయమున పళ్ళకునూ

బుద్ధిమంతులై బాగుపడ తలచుకొన్న వారెవరైననూ ఎట్టి పరిస్థితులలోనూ చూపుడు వ్రేలును తగుల నీయరాదు! ఎందులకు అనగా -

'చూపుడు వ్రేలు' అను తెలుగు పదమునకు సంస్కృత భాష యందు 'తర్జనీ' అని పేరు! తర్జనీ అనగా 'బెదరించునది' అని అర్థము!

'నిన్ను చంపెదను! నిన్ను తన్నెదను ! నిన్ను పొడిచెదను ! నిన్ను పాతి వేసెదను ! నిన్ను బూడిద చేసెదను!' అని బెదిరించునప్పుడు తప్పక చూపుడు వ్రేలును చూపెదరు ! అందువలన చూపుడు వ్రేలుకు దోషము అంటుకొనినది! కనుక పైన చెప్పబడిన ఐదు పనుల యందు 'మేలును పొందవలెను' అను కోరిక కల్గిన జీవులు తప్పనిసరిగా చూపుడు వ్రేలును ఉపయోగింపరాదు!





శ్లో. గోకర్ణాzకృతి హస్తేన మాష మగ్న జలం పిబేత్,
తన్న్యూన మధికం వాzపి సురాపాన సమం భవేత్. ౫

తా. చూపుడు వ్రేలును క్రిందకు దించి, బొటన వ్రేలును నడిమి వ్రేలి క్రింది కణుపు మొదలు నందు గట్టిగా నొక్కి పట్టి వుంచినచో - అది 'ఆవు చెవి' వలె కన్పించును! అందువలన దానిని 'గోకర్ణా కృతి హస్తము' అందురు ! దానిలో ఒక మినుపగింజ మాత్రమే మునుగునంత తీర్థజలమును వుంచుకొని భగవన్నామోచ్చారణముతో సేవింప వలయును! ఎక్కువగ గానీ, తక్కువగా గానీ; త్రాగినచో మద్యపాన దోషము కలుగును! (త్రాగగా మిగిలిన తడిని బ్రహ్మ రంధ్రముపై వుంచుకొనవలయును ! లేనిచో నరకమున పతనమగుదురు ! ఇది తథ్యము)

శ్లో. అంగుష్ఠాzగ్రః సమాzకుంచ్య మధ్య మా మధ్యపర్వణి,
'గోకర్ణంతద్ధి విజ్ఞేయం సర్వాz చమనేష్విహ. (ధర్మప్రవృత్తిః

తా. బొటనవ్రేలు చివరను వంచి; మధ్య వ్రేలి, మధ్య కణుపునకు (గట్టిగా అదిమి) పెట్టినచో దానిని 'గోకర్ణ' యని అందురు. అన్ని విధములగు ఆచమనములు చేయునపుడునూ ఈ గోకర్ణా కృతిహస్తము ముఖ్యమైనది !

## ❄ శ్రీ విష్ణు నివేదిత ప్రసాద మహిమా ❄

శ్లో. అగ్నిష్టోమ సహస్రాణి వాజపేయ శతాని చ
సమ్యక్ ఫల మవాప్నోతి విష్ణో ర్నైవేద్య భక్షణాత్. .౧.

తా. విష్ణువునకు నివేదన మొనర్చిన ప్రసాదమును తినిన జీవులకు 'అగ్నిష్టోమము' అను పేరు గల యజ్ఞము వేయిసార్లు చేసిన పుణ్య ఫలమునూ; నూఱుమారులు 'అశ్వమేధ' యాగములు చేసిన పుణ్య ఫలమునూ వెనువెంటనే లభించును !

శ్లో. నైవేద్య యుక్తాం తులసీం చ మిశ్రితాం విశేషతః పాదజలేన విష్ణోః.
యోఽశ్నాతి నిత్యం పురతో మురారేః ప్రాప్నోతి యజ్ఞాఽయుత కోటి పుణ్యమ్..౨.

తా. విష్ణువునకు నివేదనము చేయు హవిస్సునందు తులసీదళమును ఉంచి నైవేద్యమొనరించి ప్రసాదమును భగవంతుని సామీప్యమున తిని, పాదజల తీర్థమును ఎవరు త్రాగుదురో - వారు పదివేల కోట్ల (10,00,00,00,00,000) యజ్ఞములు (విష్ణుప్రీతికై) చేసిన పుణ్య ఫలమును పొందెదరు !

శ్లో. కోట్యోహి బ్రహ్మ హత్యానాం, మగమ్యా గమ్య కోటయః,
తా స్సర్వా నాశ మా యాంతి విష్ణో ర్నైవేద్య భక్షణాత్..3.

తా. విష్ణు ప్రసాదమును భక్షించిన పుణ్య ఫలము వలన - కోట్ల కొలది బ్రహ్మ హత్యాదోషములునూ; వావి - వరుసలు లేక పరస్త్రీలతో శృంగార క్రీడలాచరించిన కోట్ల కొలది పాపములునూ; సర్వపాపములునూ నశించును !





శ్లో. పాదోఽదకం చ నిర్మాల్యం మస్తకే ధారయే త్సదా.
విష్ణోర్దృష్టం; భక్షితవ్యం తులసీదళ మిశ్రితమ్.
కల్పకోటి సహస్రాణి వైకుంఠే వసతే సదా.
సాలగ్రామ శిలాబిందు ర్హత్యా కోటి వినాశనః

తా. విష్ణు బింబదర్శనమూ, పాదోకము త్రావి - విష్ణు నిర్మాల్యమును స్వీకరించి శిరమున ధరించుట; తులసీదళ మిశ్రితమగు విష్ణుప్రసాదమును భక్షించుట; ఈ క్రియల వలన భక్తులకు కోట్ల వేల కల్పముల యందు వైకుంఠ వాసము లభించును! సాలగ్రామ శిలకు స్నపన మొనర్చిన నీరు ఒక బిందువైననూ నాలుకకు తగిలిన, కోటిహత్యలు చేసిన వారికైననూ పాపములు సమూలముగా వినాశనమగును !

## ❄ ప్రదక్షిణ విధి ❄

1 ప్ర: ప్రదక్షిణము అనగా నేమి ?

స: ప్రదక్షిణము అనగా-

శ్లో: (ప్రదక్షిణ క్రమం వక్ష్యే శృణుధ్వం ముని సత్తమాః)
సర్వపాపహరం చైవ సర్వదానఫల ప్రదమ్.
సర్వరోగ ప్రశమనం చరే త్తస్మాత్ ప్రదక్షిణమ్. .౧.

తా. పాపములన్నియును హరించుటకునూ, అన్ని దానములు (దశదాన; షోడశ మహాదానములు) చేసిన పుణ్యఫలము లభించుటకునూ; వ్యాధులన్నియునూ నివారణమగుటకునూ, ప్రదక్షిణము చేయవలెను!

* విశేష వివరణము-

ప్రదక్షిణము అనగా దక్షిణ బాహువును (కుడిచేయిని) పరమాత్మ వైపు వుంచి ఆయన చుట్టునూ చుట్టి వచ్చునది! అని అర్థము ! మానవుని జన్మ - కర్మలు దారము వంటివి ! మఱల - మఱల, పుట్టుట -

గిట్టుట అను ఒక ఎడతెగని అదృశ్యవలయము వంటిది! దారమును చిక్కుపడనీయక, తెగిపోనీయక, ముడులు పడనీయక వుంచుటకు దానిని ఒక 'కండె'కు చుట్టుదురు! ఆ కండెయే - 'పరమాత్మ!' జీవులు తమ జనన - మరణ వలయము నుండి తమను తాము రక్షించుకొనుటకు (మోక్షప్రాప్తికి) ఆధారమును కండెకు పూర్తిగా చుట్టవలెను. ఎప్పటికో - ఒక అప్పటికి ఆదారము మిగులక పూర్తిగా కండెకు చుట్టుకొని దానికి అంటి పెట్టుకొనును! అనగా - ప్రదక్షిణములు చేసిన జీవులు చివరకు మోక్షప్రదాత అగు భగవానుని సాన్నిధ్యమునకు తప్పక చేరుకొందురు! (ఇది ప్రదక్షిణ వివరణము)

## ❊ ప్రదక్షిణ శబ్ద అర్థము ❊

2\. శ్లో. ప్రచ్ఛినత్తి భయం సర్వం; దకారో మోక్ష సిద్ధిదః,
క్షికారాత్ క్షీయతే రోగో; ణకార శ్రీ పదాయకః.
ప్రదక్షిణార్థం సంయోగాన్ ప్రదక్షిణ మితి స్మృతమ్..౨.

తా. 'ప్ర' అను అక్షరము = సర్వభయములను పోగొట్టును!
'ద' అను అక్షరము = మోక్షమును ప్రాప్తింప జేయును!
'క్షి' అను అక్షరము = సర్వవ్యాధి వినాశకము!
'ణ' అను అక్షరము = సకలైశ్వర్య (లక్ష్మీ కటాక్ష) ప్రదాయకము!

అనగా - 'ప్రదక్షిణ' శబ్దమునకు - సర్వ భయహారిణి, మోక్ష దాయిని; సర్వవ్యాధి వినాశిని, అఖండ ఐశ్వర్యదానిని! అని తెలియవలెను!

3\. శ్లో. పదాత్ పదాన్తరం గచ్ఛే త్కరౌ చలన వర్జితౌ,
స్తుతి ర్వాచి; హృది ధ్యానం చతురంగం ప్రదక్షిణమ్. 3





తా. ప్రదక్షిణమునకు నాలుగు అంగములు : 1. (ఒకటి) అడుగు వెంట అడుగు వేయుచు నడచుట! 2 (రెండు) - చేతులుకదలనీయక (నమస్కరించుచూ) వుండుట! 3 (మూడు) - నోటి వెంట (పరమాత్మను) కీర్తించుట, 4 (నాలుగు) మనసున (సదా) భగవానుని తలచుకొనుట.

ఈ నాలుగునూ ప్రదక్షిణమునకు అంగములు! ఈ నాలుగు అంగములు కలిగిన ప్రదక్షిణము భగవత్ ప్రీతికరము! భక్తులకు కోర్కెలను సిద్ధింప జేయును! ఈ నాలుగు అంగములు సరిగా లేని (శ్రద్ధా భక్తులు లేని) ప్రదక్షిణము నిర్థరకము! అని భక్తులు గ్రహింపవలెను!

(అశ్వత్థ స్తోత్రే బ్రహ్మ - నారద సంవాదే - (చతుర్ ముఖ బ్రహ్మ, నారదునకు చెప్పినది)

3\. శ్లో. పదే పదాzన్తరం గత్వా కర చేష్టా వివర్జితః,
వాచా స్తోత్రం, మనో ధ్యానే చతురంగం ప్రదక్షిణమ్..3.)

4\. ప్ర: ప్రదక్షిణము ఏవిధముగా చేయుట శ్రేష్ఠము ?

స: శ్లో. ఆసన్న ప్రసవా నారీ తైల పూర్ణ యథాఘటమ్
వహన్తి శనకై ర్యాతి; తథా కుర్యాత్ ప్రదక్షిణమ్..౪.

తా. నేడో - రేపో ప్రసవించు రీతిలో వుండిన నిండు చూలాలు - నూనెతో నిండుగా నింపిన కుండను, మోయవలెననినచో - తొణకనీయక ఎట్లు భద్రముగా మెల్లగా మోయుచు అడుగులో అడుగు వేయుచూ నడచునో ఆ రీతిగా (పరమాత్మ ప్రీతిగా) ప్రదక్షిణము చేయవలెను!

విశేష వివరణము:-

నెలలు నిండిన చూలాలే భద్రత కొఱకు అమిత నెమ్మదిగా నడచును! అటువంటి స్త్రీ - నూనె నిండుగా వుండిన కుండను నూనె తొణకనీయక చిందనీయక; నూనెకుండ క్రిందపడి బ్రద్దలై నూనె నేలపాలు కానీయకుండా గమ్యస్థానమునకు చేర్పవలెననినచో ఇంకనూ మరి ఎంత మెల్లగా నడువవలెనో - ఆ తీరున భక్తులు పరమాత్మ ఆలయమున ప్రదక్షిణము చేయునపుడు అడుగు వెంట అడుగు వేయుచు ప్రతి అడుగు వేయునపుడు మోక్షప్రదాత యగు పరమ పదనాథుని (శ్రీ మన్నారాయణుని) లేక ఆలయమున ఉండిన మూర్తిని త్రికరణ శుద్ధిగా తలచుకొనుచూ ప్రదక్షిణము చేయవలెను ఇది శాస్త్ర వచనము!

(ఇంతవఱకునూ తెల్పిన ప్రదక్షిణ విషయ సంబంధ శ్లోకములు బ్రహ్మశ్రీ శిష్టా చంద్రమౌళి శాస్త్రి గారిచే వ్రాయబడిన - ''సుందర హనుమత్ వైభవము'' అను గ్రంథ రాజము నుండి కృతజ్ఞతతో స్వీకరించినాడను! 'అనుక్తోzన్యతో గ్రాహ్యమ్' అను శాస్త్ర న్యాయము చొప్పున గ్రహించితిని! వారికి కృతజ్ఞుడను)

అనగా - మనవద్ద ఉండిన గ్రంథముల యందు సంశయనివృత్తి చేయు శాస్త్ర ప్రమాణము అలభ్యమైనచో - ఇతర ఆగమ గ్రంథముల నుండియును, ఇతర నిబంధన గ్రంథముల నుండియునూ ఉత్తమ ప్రమాణములు లభించిన కృతజ్ఞతతో స్వీకరింపవచ్చును !

## ❄ దేవతలూ - ప్రదక్షిణములూ ❄

4 ప్ర: ఏయే దేవతలకు ఎన్నెన్ని ప్రదక్షిణములు చేయవలెను ?

స: ప్రమాణ గ్రంథము శ్రీ పాంచరాత్రే - పౌష్కర సంహితా-





శ్లో. ఏకం గాణాధిపం కుర్యాత్; ద్వే సూర్యే; త్రీణి శంకరే ।
చత్వారిః కేశవేదేవే; సప్తాz శ్వర్థే ప్రదక్షిణమ్ ॥ .౫.

తా. ౧ గణపతికి ప్రదక్షిణము = ఒక మారు చేయవలెను!

౨ సూర్యునకు ప్రదక్షిణము = రెండు మారులు చేయవలెను!

3 శివునకూ (శివభక్తులకూ) = మూడు మారులు చేయవలెను!

౪ విష్ణువునకూ = విష్ణుభక్తులూ మొదలగు వారికి నాలుగు మారులు చేయవలెను!

౭ రావి చెట్టుకు = ఏడుసారులు చేయవలెను.

★ రావి చెట్టుకు బిడ్డలు కలుగని వారు ప్రదక్షిణము చేసిన బిడ్డలు కలుగుదురు.

ధర్మప్రవృత్తి (అను ధర్మ శాస్త్ర నిర్ణయ) గ్రంథము నందు కొద్ది మార్పుతో ఇదే శ్లోకము ప్రదక్షిణమునకు కలదు -

శ్లో. ఏకంగాణాధిపే కుర్యాత్; ద్వే సూర్యే; త్రీణిశంకరే,
చత్వారిః కేశవేదేవే; సప్త శక్తేః ప్రదక్షిణమ్. ౬

శ్రీ పాంచరాత్ర దివ్యాగమాzంత ర్భూతమగు పది రెండు వేల (12,000) సంఖ్య గల సంహితల యందు గల ఒక సంహిత శ్రీ పౌష్కర సంహిత యందు చెప్పబడినరీతిగనే -

| | |
|---|---|
| వినాయకునికి | = ఒక మారు |
| సూర్యునకు | = రెండు సార్లు |
| శివునకు | = మూడు తడవలు |
| విష్ణువునకు | = నాలుగు పర్యాయములు అని చెప్పి - |

శ్రీ పౌష్కర సంహితలో రావి చెట్టునకు = ఏడుసారులు అని తెలుపగా ధర్మప్రవృత్తి యందు - శక్తి దేవతలకు = ఏడుసారులు అని తెలియ జేసి యుండిరి!

విశేష వివరణము:

శాస్త్రములో చెప్పబడిన రీతిగా కాక ప్రదక్షిణములు (తెలియక గానీ; అహంకారముతో గానీ) చేసినచో పూర్వ పుణ్యము కూడా నశించును!

భక్తులు త్వరగా వెళ్ళవలసిన పని వుండిననూ; చేయుటకు ఓపిక లేకపోయిననూ ప్రదక్షిణము చేయకయే పరమాత్మకు నమస్కరించి, తీర్థమును స్వీకరించి; పాదుకలను శిరమున ధరించి వెడలవచ్చును! బయటకు వెడలు నపుడు కూడా పృష్ఠము (వీపు) ను దేవునకు చూపక మెల్ల మెల్లగా వెనుకకు నడచి, ఆలయ ప్రాకారము దాటిన తరువాత, ఏ ముఖముగా నైనను వెడల వచ్చును!

5 ప్ర: 'ఆత్మ ప్రదక్షిణము' అను పేరుతో భక్తులు దేవుని ముందఱ తమ చుట్టునూ తాము బొంగరము వలె తిరుగుచున్నారు! కొందఱు అర్చకులునూ; పురోహితులునూ మంత్ర పుష్పమును దేవునికి సమర్పించిన తరువాత తిరుగమని భక్తులకు చెప్పుచున్నారు వీరు చెప్పునటువంటి ఆత్మ ప్రదక్షిణ శాస్త్ర బద్ధము అగునా ?

స: ఆత్మ ప్రదక్షిణము అనగా - మానవుని హృదయ పద్మమున సన్నివిష్టుడై వుండిన పరమాత్మ చుట్టునూ మానవుడు తన ఆత్మ (మనసు) ను త్రిప్పవలయును! ఆ విధముగా పరమాత్మకునూ భక్తుడగు జీవునకునూ అవినాభావ సంబంధము కల్గి దృఢమగును.





ఇప్పుడు చేయుచున్న 'ఆత్మ ప్రదక్షిణము' అనునది దేవునకు పృష్ఠము (వీపు) ను చూపునటువంటిది! ఇటువంటి ప్రదక్షిణము భ్రష్ట ప్రదక్షిణము! దీని వలన భగవదనుగ్రహమునకు దూరులై నరకమున కూలుదురు! ఉత్తమ గతుల యందున్న పితృదేవత లెల్లరూ నరకమున విధిగా పతనమౌదురు!

ప్రదక్షిణము అనగా - దక్షిణ బాహువును (కుడిచేతిని) పరమాత్మ వైపునకు చూపుచూ తిరుగునది' అని అర్థము! ఇప్పటి ఆత్మ ప్రదక్షిణము అట్లుకాదు! దేవుని ఎదుట భక్తుడు నిలచి గుండ్రముగా తనచుట్టునూ తాను తిరుగుచూ వున్నచో ఎదుఱ రొమ్ము కొంతసేపునూ; ఎడమ చేతిని కొంత సేపునూ; వీపునూ-ముడ్డినీ కొంతసేపునూ; కుడిచేతిని కొంతసేపునూ చూపుట ఈ ప్రదక్షిణమునందు జరుగుచూ వుండినది. కనుక ఇది భ్రష్ట ప్రదక్షిణము! దీనికి ఫలము నరక ప్రాప్తి !!

ఆత్మ ప్రదక్షిణము అను పేరుతో ఈ నాళ్ళలో ఆచరించునది "ఎంతమాత్రమునూ చేయరాదు!"

దీనికి శాస్త్ర ప్రమాణము: శ్రీ వేదాన్త దేశికుల వారి 'పాంచరాత్రరక్ష' అను గ్రంథమున-

శ్లో. చక్రవ ద్భ్రామయే న్నాంగం; పృష్ఠభాగం న దర్శయేత్।
పశ్చా ద్భాగేన నిర్గచ్ఛే ద్దేవతా సన్నిధౌ సుధీః ॥ .౭.

తా. పరమాత్మకటాక్షముచే రక్షింపబడవలెనను కోరిక బలీయముగా కలిగిన భక్తుడు బొంగరము వలె, (లేక) కుమ్మరి వాని 'సారె' వలె తన చుట్టునూ తాను దేవుని సన్నిధానమున, దేవుని దృష్టికి ఎదురుగా వీపునూ, ముడ్డినీ చూపుచూ తిరుగరాదు!

(తెలియకకానీ, అహంకారముతో కానీ, ('పెద్ద పంగనామాలు పెట్టి కాషాయ గుడ్డలు కట్టిన స్వాములోరు చెప్పారు !' అని కానీ దుష్టఫలమును ఒసగు ఇప్పటి 'ఆత్మ ప్రదక్షిణము చేసినచో - నరకలోకమున తప్పక కూలుదురు)

భగవానుని సేవించిన తరువాత ఆలయము నుండి వెలుపలకు వెడలునపుడు కూడా మెల్లగా వెనుకకు నడచి బయటకు చేరిన తరువాత ఏ దిక్కుగా నైననూ వెడలవచ్చును! ఇది ఉత్తమ భక్తులు చేయు విధానము!

## ❄ పంద్రెండు ప్రదక్షిణములు ❄

6 ప్ర: కళ్యాణోత్సవముల యందు భగవదాలయమున పరమాత్మకు జరుపు 'ద్వాదశావరణ క్రమము' ఏ తీరున చేయవలెను?

స: ప్రమాణ గ్రంథము -?

శ్లో. భేరీ - నృత్తం. చ- గీతం - చ- మృదంగం - మురళీ తథా,
ఘంటా తాళం చ శంఖం చ శృతి కాహళ మేవ చ.
వేద ఘోషం చ మౌనం చ; ద్వాదశాzవరణ క్రమమ్,

తా. భగవానుని కళ్యాణోత్సవ దినముల యందు పంద్రెండు ప్రదక్షిణములు జరుపునపుడు ఈ క్రింద చెప్పబడిన రీతిని వరుస క్రమముగా చేయుట శాస్త్ర సిద్ధము! అన్యథా వ్యత్యస్తముగా చేయుట శాస్త్ర విరుద్ధము!

1వ ప్రదక్షిణము = నగారా ధ్వనితో చేయవలయును!

2వ ప్రదక్షిణము = నృత్యముతో చేయవలయును !

3వ ప్రదక్షిణము = పాటలతో చేయవలయును !

4వ ప్రదక్షిణము = మద్దెల మ్రోతతో చేయవలయును!





5వ ప్రదక్షిణము = పిల్లగ్రోవి ధ్వనితో చేయవలయును!

6వ ప్రదక్షిణము = ఘంటానాదముతో చేయవలయును!

7వ ప్రదక్షిణము = భజన తాళములతో చేయవలయును!

8వ ప్రదక్షిణము = శంఖ ధ్వనితో చేయవలయును!

9వ ప్రదక్షిణము= మంగళవాద్యములు లేని శ్రుతి ధ్వనితో చేయవలయును!

10వ ప్రదక్షిణము = కొమ్ముబూర (బాకా) ధ్వనితో చేయవలయును!

11వ ప్రదక్షిణము = వేదపఠనముతో చేయవలయును!

12వ ప్రదక్షిణము = (ఏ శబ్దముననూ చేయక) మౌనముగా చేయవలయును!

ఈ పన్నెండు ప్రదక్షిణములు ద్వాదశాక్షరీ మంత్రమునకు చిహ్నముగా 'ఓమ్ నమో భగవతే వాసుదేవాయ!' అను మంత్రము మనసున స్మరించుచూ చేయవలెను!

ప్రతి ప్రదక్షిణమునకునూ ముందునూ; పూర్తియైన పిమ్మటనూ శ్రీ లక్ష్మీ సహితుడగు నారాయణునకు అర్ఘ్య - పాద్యాదులు. ధూప, దీప, నివేదన, కర్పూర నీరాజనములు సమర్పించి - వింజామరముతో వీచి మరల ప్రదక్షిణము మొదలిడ వలెను! ఇది ద్వాదశావరణ క్రమము అను పేరుగల పంద్రెండు ప్రదక్షిణముల వివరణము!

## ❄ బలి దాన మన్త్రము ❄

మంత్రమ్:-

యే భూతాః ప్రచరన్తి దివా, నక్తం బలి మిచ్ఛన్తి వితుదస్య పేష్యాః,
తేభ్యో బలిం పుష్టికామో హరామి మయి పుష్టిం పుష్టిపతి ర్దదాతు.

తా. ఏ భూతములు రేయింబవళ్లు బలి పదార్థములను కోరుచూ వుండినవో - ఆ భూతములు బలమునూ, పుష్టినీ కల్గించు బలిని స్వీకరించి, నన్ను పుష్టిగల వానినిగా చేసి పుష్టిగలవారిలో శ్రేష్ఠునిగా చేయుగాక.

## ❄ అధి (మల) మాస నిర్ణయము ❄

శ్రీ వశిష్ఠః (నిర్ణయ సింధౌ) -

శ్లో. ద్వాత్రింశద్భి ర్గతై ర్మాసై ర్దినై షోడశభిః స థా.
ఘటికానాం చతుష్కేణ పత త్యధిక మాసకమ్. ౧

తా. చాంద్రమాన మాసములు ముప్పది రెండునూ - దానిపై పదునాలు దినములునూ - దానిపై నాలుగు గడియల కాలమునూ గడచిన వెంటనే అధిమాసము (లేక - అధిక మాసము లేక మలిమ్లుచ మాసము లేక మలమాసము) సంభవించును!

అని శ్రీ వశిష్ఠ మహర్షి తెలిపినట్లు 'నిర్ణయ సింధు' అను గ్రంథము నందు కలదు!





## ❄ అధి మాస; క్షయ మాసములు ❄

కాఠక గృహ్య సూత్రే

శ్లో. యస్మి న్మాసే నసంక్రాన్తి స్సంక్రాన్తి ద్వయ మేవవా,
'మలమాస' స్సవిజ్ఞేయో, మాస స్స్యాత్తు త్రయోదశ.

తా. ఏ చాంద్రమాన మాసమునందు సూర్యుని రాశిసంక్రమణము జరుగదో - ఆ చాంద్రమాన మాసము 'అధికమాసము'! ఏ చాంద్రమాన మాసము నందు సూర్యుడు రెండు రాశుల యందు ప్రవేశించునో - ఆ చాంద్రమాన మాసము 'క్షయ మాసము'! 'అధికమాసము' నూ, 'క్షయమాసము' నూ, ఈ రెండు మాసములునూ 'మలమాసములు' అని పేరు పొందినవి! అధిక మాసముగానీ, క్షయమాసము గానీ వచ్చిన సంవత్సరమునందు చాంద్రమాన మాసములు పండ్రెండు నెలలకు గాను - పదు మూడు నెలలు వచ్చును!

శ్లో. అ సంక్రాన్తి మాసోధిzమాసస్ఫుటం స్యా
ద్వి సంక్రాన్తి మాసః క్షయాzఖ్యః కదాచిత్,
క్షయః కార్తికాzదిత్రయే నాz న్యతస్యా
త్తదా వర్షమధ్యేz ధిమాస ద్వయం భవతి. ౩

(జ్యోతిశ్శాస్త్రే)

తా. సూర్యుని రాశీ ప్రవేశము జరుగని చాంద్రమాన మాసము అధిమాసము!

ఒకే చాంద్రమాన మాసమునందు సూర్యుడు రెండు రాశులను ప్రవేశించినచో - అది క్షయమాసము! ఇది స్పష్టమైన గుర్తు!

★ క్షయ మాసము ఎప్పుడు వచ్చిననూ కార్తికమాసమునందు గానీ, మార్గశీర్ష మాసమునందు గానీ, పౌషమాసము నందు గానీ సంభవించును! ఇతర మాసముల యందు (అనగా చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వీన, మాఘ, ఫాల్గుణ మాసములయందు సంభవింపదు!

క్షయమాసము వచ్చిన సంవత్సరము నందు క్షయమాసమునకు ముందు ఒక అధికమాసమునూ క్షయమాసము వెళ్ళిన తరువాత ఒక అధికమాసమును తప్పక (రెండు అధికమాసములు) కలుగును!

(గత కాలమున శ్రీ దుందుభినామ సంవత్సరమునందు పౌషమాసము క్షయమాసముగా వచ్చి వున్నది!)

★ క్షయమాసమునకు ముందు వచ్చు అధికమాసమునకు 'సంసర్ప' అని పేరు!

★ క్షయ మాసమునకు 'అంహస్పతి' అని పేరు!

'శ్రీ దుందుభి' సంవత్సరమునందు మాసమంతయూ మధ్యాహ్నము వఱకునూ పౌషమాసముగానూ, దానినుండి తక్కిన దినమంతయు మాఘమాసముగానూ వ్యవహరింపబడినవి!)-క్రీ.శ 1982లో వచ్చినది!

శ్రీ దుందుభి సంవత్సరము క్రీస్తు శకము లెక్క ప్రకారము 1982వ సంవత్సరము నందు వచ్చినది! క్షయమాసము వెంట వెంటనే అధిక మాసము వలె మూడేండ్ల కొకసారి రాదు! అది మఱల వచ్చుటకు నూట నలుబది నాలుగు సంవత్సరముల కాలము పట్టును! (అప్పుడప్పుడు) ఒకొక్కసారి పందొమ్మిదివత్సరములకు కూడా రావచ్చును!





అధి(క) మాసమునకునూ క్షయమాసమునకునూ; మల మాసమనియునూ మలిమ్లుచ మాసమనియునూ పేర్లు కలవు!

శ్రీ నారదవచనమ్ (వైద్య నాథీయే)

శ్లో. సంక్రాన్తి రహితో మాసో యో వా సంక్రాన్తి యుగ్మయుక్,
'మలమాసా' వితి ప్రోక్తా సర్వ కర్మ బహిష్ కృతౌ. ౪

తా. సూర్య సంక్రమణము జరుగని చాంద్రమాన మాసమైననూ, సూర్య సంక్రమణములు రెండునూ ఒకే చాంద్రమాన మాసమునందు జరిగిననూ; మొదటి సూర్యసంక్రాంతి జరుగని చాంద్రమాన మాసమునకు 'సంసర్ప' మని పేరు! రెండు సూర్య సంక్రమణములు జరిగిన చాంద్రమాన మాసమును 'క్షయ' మాసమందురు దానికి 'అంహస్పతి' మాసమని పేరు!

అధిక మాసమైననూ - క్షయ మాసమైననూ; ఈ రెండు మాసములునూ 'మలమాస' ములు అనియూ 'మలిమ్లుచ' మాసము అనియూ పేరు గలిగి యున్నవి! 'సంసర్ప' మను పేరుగల క్షయమాసమునూ సర్వశుభకర్మలు చేయుటకును పనికిరావు! (అని శ్రీ నారదమహర్షి చెప్పినట్లు శ్రీ వైద్యనాథుని ధర్మ శాస్త్ర నిర్ణయ గ్రంథము నందు ఉదాహృతమైనది)

❄ అధిమాసములు ఏయే మాసములలో వచ్చును ❄

నిర్ణయ సింధౌ

శ్లో చైత్రాఽదాశ్వయుజాఽన్తేషు అధిమాసాః ప్రకీర్తితాః,
నక్షయో; నాఽధిమాసస్యా న్మాఘో వై పరికీర్తితః. ౫

తా. చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ మాసములయందు మాత్రమే అధికమాసములు ఏర్పడును! (అనగా తక్కిన కార్తిక, మార్గశిర, పౌష, మాఖ, ఫాల్గుణ మాసముల యందు అధిక మాసములు ఏర్పడవు!)

★ క్షయ మాసములు - కార్తిక, మార్గశిర, పౌష మాసముల యందే సంభవించును! (ఇతర మాసముల యందు క్షయ మాసములు కలుగవు!)

★ మాఖమాసమునందు అధిక మాసము గానీ, క్షయ మాసము గానీ ఎన్నడునూ సంభవింపదు!

★ క్షయ మాసమునకు ముందు ఒక అధికమాసమునూ, క్షయ మాసమునకు పిమ్మట ఒక అధికమాసమునూ విధిగా (తప్పక) సంభవించును!

## ❉ మల (అధిక, లేక - క్షయ) మాసవ్రతము ❉

కాలము పరమాత్మయగు సూర్య భగవానుని వలన కలుగుచు వున్నది. సూర్యుని నడకకునూ, చంద్రుని నడకకునూ సంవత్సరమునకు దాదాపు పదునొకండు దినములు వ్యత్యాసము కలుగుచు వున్నది. సర్వ గ్రహములకునూ అధిపతి సూర్యుడు కనుక తక్కిన గ్రహముల నడకల యందు సంభవించిన హెచ్చు, తగ్గులను క్షయ అధిక మాసముల ద్వారా సూర్యగతితో సరి చేసికొని తీరవలెను! అటుల సరిచేసుకొనక పోయినచో ఋతువులు వ్యత్యస్తములయి పోయి కాలగతి మానవునకు తెలియక కాల మౌఢ్యత ఆవరించును! అధిక మాసములనూ, క్షయ మాసములనూ, మలమాసమనియునూ, మలిమ్లుచ మాసమనియునూ మహర్షులు నొక్కి వక్కాణించి యుండిరి.





## ❉ మలమాస వ్రతము ❉

మానవులు తెలిసి కానీ, తెలియక కానీ, చేయునటువంటి మనో వాక్ కాయముల వలన పొందిన సకల కలుషములనూ పోగొట్టు కొనుటకు గాను విధిగా మల మాస వ్రతమును ఆచరింపవలయును! ఏ సంవత్సరములో అధిక మాస - క్షయ మాసములు వచ్చిననూ ఆ మాసమంతయునూ శుక్ల పక్ష ప్రథమ తిథి నుండి అమావాస్య తిథి వరకునూ తప్పనిసరిగా ఆ నెల అంతయునూ కాల స్వరూపుడు; గ్రహరాజు; శ్రీ మన్నారాయణ స్వరూపుడగు శ్రీ సూర్యనారాయణుని ఛాయా-ఉషా-పద్మినీ సహితముగా శ్రద్ధా భక్తులతో సాక్షాత్ లక్ష్మీనారాయణునిగా అర్చించి విధూత కల్మషులై, పుణ్యములనూ తద్వారా శ్రీమన్నారాయణానుగ్రహమును పొందవలసి యున్నది!

ఈ నెల అంతయునూ శుచిర్స్నాతులై ప్రతి దినమునూ దేవాలయము నందు (అది వీలుకానిచో తమయింటి యందు) త్రికరణశుద్ధిగా ముప్పది మూడు (కోట్ల) దేవతా స్వరూపములనూ కలిగి యుండిన శ్రీ లక్ష్మీ నారాయణులను పదునారు ఉపచారములతో పురుష సూక్తవిధానమున అర్చించి, ముప్పది మూడు అపూప (అప్పములు) ములను నేతితో చేసి మధుర పదార్థమును నివేదనము చేసి పూజ పూర్తి ఐన తరువాత తీర్థప్రసాదములను వినమ్ర భావముతో స్వీకరింపవలెను. ప్రతి వారునూ ఈ విధముగా నెలరోజులూ చేసినచో సకల మాలిన్యములనూ దగ్ధమొనరించుకొని దివ్యతేజోమయులై అంత్యకాలమున పునరావృతి రహితమగు పరమ (విష్ణు) పదమును పొందుదురు!

## ❄ ముప్పది ముప్పురు దేవతలు ❄

### (త్రయ త్రింశ ద్దేవతా ః)

'అధిక' మాసములనూ; క్షయమాసములనూ (ఈరెండింటినీ) 'మల' మాసములనీ; 'మలిమ్లుచ' మాసములనీ - అందురు; అధిక మాసమును 'అధి' మాసమనియునూ అందురు.

మానవుడు చేసికొనిన మనో - వాక్ - కాయ సంబంధములగు పాపములు (అనేక జన్మల నుండియు అంటుకొనినటు వంటివి) నశించుటకునూ; పుత్ర - పౌత్ర; ధన - ధాన్యములు మున్నగు సకలైశ్వర్యములు కలుగుటకునూ; పరమ పదమగు విష్ణులోక ప్రాప్తికినీ, భూమండలము అంతయు ఉత్తమ బ్రాహ్మణునకు దానము ఇచ్చిన పుణ్యఫలము లభించుటకునూ శ్రీ మహావిష్ణు స్వరూపులగు (33) ముప్పది ముగ్గురు దేవతలను (వీరే ముప్పది మూడు కోట్ల దేవతలు అని జనులు అనుచుందరు) శ్రద్ధా - భక్తులతో అర్చింపవలెను! అధిక (మల) మాసమునందలి 'ముప్పది తిథుల యందునూ ప్రతిదినమునూ ముప్పది మూడు అపూపములను సర్వదేవతా సార్వభౌముడు (రాజాధిరాజాయ - అని ఋగ్వేదము) యగు శ్రీ మహావిష్ణు ప్రీతికరముగా మలమాస 'విష్ణువ్రతము'ను విధిగా ఆచరింపవలెను;

1. అష్ట (8) వసువులు:- 1 వరుణ 2 వృషభ 3 నహుష 4 జయ 5 అనిల 6 విష్ణు 7 ప్రభాను 8 ప్రత్యూష - అనుపేరులు కలిగినవారు!

2. ఏకాదశ (11) రుద్రులు:- 1 ఉగ్ర 2 సోమ 3 శర్వ 4 మృగవ్యాధ 5 భిషక 6 అహిర్ - బుధ్న్య 7 పినాకీ 8 ఈశ్వర 9 కాపాలిక 10 భీమ 11 భిషక్ - అనుపేరులు కలవారు!





3. ద్వాదశ (12) ఆదిత్యులు:- 1 అర్యమ 2 మిత్ర 3 వరుణ 4 అర్క 5 భగ 6 ఇంద్ర 7 వివస్వన్ 8 పూషా 9 పర్జన్య 10 త్వష్టా 11 విష్ణు 12 అజ - అను పేరులు కలవారు!

4. ఇంద్రుడు ఒకరు (1)

5. బ్రహ్మ ఒకరు (1) వీరు అందఱునూ కలిసి -

8 + 11 + 12 + 1 + 1 = 33 ముప్పది ముప్పురు విష్ణు స్వరూపులు! (సర్వం విష్ణు మయం జగత్ - అని శృతి) కాల స్వరూపుడగు సూర్యనారాయణ మూర్తి విష్ణువే! (ఆదిత్యానా మహం విష్ణుః) అని భగవానుడు గీత యందు సెలవిచ్చి వుండెను.

ముప్పది ముప్పురు దేవతలను ఆహ్వానించుటకునూ - పూజించుటకునూ ముందు శ్రీ మన్నారాయణుని ఆవాహనము చేసి అర్చింపవలెను.

సంకల్పమునందు -

శ్రీ మన్నారాయణ స్వరూప అష్టవసవేభ్యోనమః
శ్రీ మన్నారాయణ స్వరూప ఏకాదశ రుద్రేభ్యో నమః
శ్రీ మన్నారాయణ స్వరూప ద్వాదశ ఆదిత్యేభ్యోనమః
శ్రీ మన్నారాయణ స్వరూప వాణీసహిత చతుర్ముఖ దేవతాభ్యోనమః
శ్రీ మన్నారాయణ స్వరూప శచీ సహిత పురందరేభ్యోనమః -

అని చెప్పి ఆవాహనాది 18 ఉపచారములతో - పురుష సూక్త విధానముగా శ్రీమత్ దివ్యపాంచరాత్రాగమ మార్గమున శ్రద్ధాభక్తులతో అర్చించి ముప్పది మూడు అపూపములను (అప్పములను) మధుర భావముతో నివేదించి - ఒక కంచు పాత్ర యందు నేయి పోసి, అప్పములు పెట్టి, కొలదిగానైననూ బంగారమును వుంచి దక్షిణతో కూడిన

తాంబూలవముతో ఉత్తమ బ్రాహ్మణునకు 'ఈ' 'మల మాస' వ్రత సమయమున - తాను వుండిన చోటు. పవిత్ర కురుక్షేత్రభూమి అనియూ, ఘృత, స్వర్ణయుక్త అపూపదానము సర్వభూమండల దానముతో సమము అనియూ, దానము స్వీకరించు బ్రాహ్మణుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడనియూ ఉత్తమ దివ్యభావనతో దానమొసంగినచో - అనేక జన్మార్జిత పాపములు నశించును. సర్వోత్తమపుణ్య ఫలములభించును; ఇహ లోకమున సౌభాగ్య లక్ష్మీ కటాక్షమునూ - పరమున పునరావృతి రహితమగు విష్ణు పదమునూ లభించును!

స్వస్తిః!

## ❄ తిథి శబ్దార్థము ❄

*సిద్ధాంత శిరోమణౌ - (కాలమాధవీయే)*

శ్లో. తన్యంతే కిలతా యస్మాత్తస్మాత్తా స్తిథ తిథయ స్స్మృతా.

తా. ''తనోతి'' అనుధాతువు నుండి పుట్టినది - ఈ 'తిథి' అను శబ్దము తనోతి అనగా - (చంద్రకళలను దినదినమునూ పెంచుట) విస్తరించునది - అని అర్థము!

తిథులు మూడు విధములు :

1. ఖర్వ, 2. దర్వ, 3. హింస్ర - అనునవి!

**1)** ఖర్వ: సమతిథి = (సూర్యోదయ కాలము నుండి మఱునాటి సూర్యోదయ కాలము వఱకునూ వుండునది) 'ఖర్వ' అని పేరు!

**2)** దర్వ: వృద్ధియైన (60 గడియల కన్నను పెరిగిన) తిథిని 'దర్వ' అందురు!





**3)** హింస్ర : క్షీణత కల్గిన (60 గడియల కాలమునకు తగ్గిన) తిథిని హింస్ర అందురు!

చంద్ర, సూర్యుల: పూర్తి సన్నిహితత్వము - అమావాస్య అగును (చంద్రసూర్యుల నడుమకు ఒకే ఋజురేఖపైకి భూమి వచ్చినచో - అది అమావాస్య. సూర్యకాంతి చంద్రునిపై పూర్తిగా పడిన దినము పౌర్ణమి తిథిగానూ; సూర్యకాంతి చంద్రునిపై పడుటకు అడ్డుగా భూమి తన చుట్టునూ తాను తిరుగుచూ; సూర్యుని చుట్టునూ తిరుగు క్రమములో కృష్ణపక్షము నందు దినదినమునకు చంద్రబింబమునకు కొంత అడ్డము వచ్చుచూ వుండును. శుక్లపక్షము నందు దినదినమునకునూ చంద్రబింబమునకు భూమి కొంత కొంత అడ్డము తొలగుచుండును! ఈ హెచ్చు - తగ్గులే చాంద్రమాన తిథులు అని తెలియవలెను!

అమావాస్య : అనగా వృత్రాసురుని వధించుట వలన కలిగిన పాపము వలన ఇంద్రుడు రాజ్యభ్రష్టుడై మఱల తపము చేసి శ్రీమన్నారాయణానుగ్రహము వలన శక్తినీ ఐశ్వర్యములనూ పొంది తనవారిని కలిసికొనిన దినము

1. వసు = సంపదలు (దానికధిపతి ఇంద్రుడు కనుక వాసవుడను పేరు కలిగెను)

2. 'వసో సూర్యస్య రశ్మిభిః' అని ఋక్కులో చెప్పబడినది. 'వసు' అనగా - సూర్యుని అనంతములయిన కాంతి కిరణముల సమూహము - అని అర్థము!

## ❁ రాకా; అనుమతీ శబ్దార్థములు ❁

వృద్ధవశిష్ఠః ఉవాచ - (కాలమాధవీయే)

1. శ్లో. రాకాచాऽనుమతిశ్చైవ పౌర్ణమాసీ ద్వయం విదుః,
'రాకా' సంపూర్ణ చంద్రస్యా; త్కలో 'నాऽనుమతి' స్మృతా. ౧

తా. పౌర్ణమీ తిథి రెండు విధములు ! అని తెలియవలెను. తిథినిండుగా వుండినచో 'రాకా' అని పేరు! ఒక కళ తక్కువైన కృష్ణపక్ష ప్రథమతిథి కలసినచో) చో దానికి 'అనుమతి' అనిపేరు! - (అని వృద్ధవశిష్ఠుడు తెలిపినాడు)

2. శ్లో. పౌర్ణమాసీ దివాదృష్టే శశి 'న్యనుమతి' స్మృతా.
రాత్రి దృష్టే పున స్తస్మిన్ సైవ 'రాకే' తి కీర్తితా.. ౨

తా. పగటి కాలము వఱకు పౌర్ణమీ తిథి వుండినచో - దానిని 'అనుమతి' అందురు! పౌర్ణమీతిథి పగలూ - రేయీ (పూర్తిగా) వుండినచో - దానిని 'రాకా' అని అందురు !

3. మత్స్య, బ్రహ్మాండ పురాణయోః (కాలమాధవీయే)

శ్లో. యస్మాత్తా మనుమస్యంతే పితరో దైవతై స్సహ,
తస్మా 'దనుమతి' ర్నామ పూర్ణిమా ప్రథమా స్మృతా. ౩

తా. దేవతలూ, పితృదేవతలూ పూర్ణిమ ప్రథమాతిథి కలిసిన భాగమునకు 'అనుమతి' అని పేరు పెట్టిరి.

శ్లో. అత్యర్థం రాజతే యస్మాత్పౌర్ణమాస్యాం నిశాకరః,
రంజనా చ్చైవ చంద్రస్య 'రాకేऽ' తి కవయో విదుః. ౪

తా. నిండుగా పూర్తి పౌర్ణమీ తిథి కలిగి పిండి ఆరబోసినట్లు వెండి వెన్నెలలు కురిపించు దినమును 'రాకా' అని తెలిసిన వారు (విద్వాంసులు) పల్కుదురు!





## ❁ సినీవాలీ; కుహూ తిథుల నిర్ణయము ❁

బృహద్వశిష్ఠః (కాల మాధవీయే)

శ్లో. దృష్ట చంద్రా మమావాస్యాం 'సినీవాలీం' ప్రచక్షతే,
ఏతామేవ 'కుహూ' మాహు ర్నష్ట చంద్రాం మహర్షయః ౧

తా. చతుర్దశీతిథిలోని కళ ఒకటి కలసిన అమావాస్యా తిథిని 'సినీవాలీ' అందురు!

చంద్రకళలు పూర్తిగా కనుపించని అమావాస్యతిథిని 'కుహూ' అందురు ! (బృహద్వశిష్ఠుడు తెల్పెను)

* చతుర్దశీమిశ్రా 'సినీవాలీ' ప్రతిప న్మిశ్రా 'కుహూ' స్మృతః ౨

కృష్ణచతుర్దశీ తిథితో కూడిన అమావాస్య తిథికి - 'సినీవాలీ' అనియునూ శుక్లప్రతిపత్ తిథితో కలసిన అమావాస్య తిథికి - 'కుహూ' అనియునూ పేర్లు ! అని కొందరు మహర్షులు తెల్పిరి!

కాత్యాయనోऽక్తం -

శ్లో. అష్టమేऽంశే చతుర్దశ్యాః క్షీణో భవతి చంద్రమాః
అమావాస్యాऽష్టమేऽంశే పునఃऽకిలऽభవే దణుః ౩

తా. చంద్రునకు కృష్ణపక్ష చతుర్దశీ ఎనిమిదవ భాగమునందు క్షీణత ప్రాప్తించును! అమావాస్యా ఎనిమిదవ భాగము మొదలు కాగానే అణుమాత్ర కాన్తివంతుడైన చంద్రుడు భాసించును!

స్మృత్యంతరే-

శ్లో. తిథిక్షయే 'సినీవాలీ' తిథివృద్ధౌ 'కుహూ' స్మృతా! ౪

తా. అమావాస్యా తిథి (సూర్యోదయము మొదలు మరునాటి సూర్యోదయము వఱకునూ లేక )60 గడియలకు తరిగినచో = 'సినీవాలీ' అనియూ అమావాస్యా తిథి 60 గడియలు (సూర్యోదయాది సూర్యోదయ పర్యంతము) కన్నను హెచ్చుగా వుండినచో 'కుహూ' అనియునూ పేరు!

## ❄ నదీ పుష్కరములు ❄

(శ్రీ చల్లా లక్ష్మీనరసింహ శాస్త్రి (ఐచ్చుపేట; బందరు) వారి పురాణోక్త కర్మ ప్రకాశిక లోనిది)

శ్లో. మేషే గంగా - వృషే రేవా - గతే యుగ్మే సరస్వతీ,
యమునా కర్కటే చైవ - గోదాసింహ గతేపిచ.
కన్యాయాం కృష్ణవేణీచ - కావేరీ తులాగతే,
వృశ్చికే భీమరథీ - చాపే పుష్కర వాహినీ.
మృగే తుంగా - ఘటే సింధూ - ప్రణీతా తటినీ ఝషే,
తిష్ఠన్నబ్దా త్సుర గురుక్రమా త్సర్వే మునీశ్వరాః.
ఆద్యంత ద్వాదశదినే, పితౄణాం దత్త మక్షయమ్.

తాత్పర్యము:

దేవగురువగు బృహస్పతి

1. మేషరాశి యందు ప్రవేశించినచో = గంగానదికి పుష్కరము
2. వృషభ రాశి యందు ప్రవేశించినచో = రేవా (నర్మదా) నదికి పుష్కరము





3. మిథున రాశి యందు ప్రవేశించినచో = సరస్వతీ నదికి పుష్కరము
4. కర్కట రాశి యందు ప్రవేశించినచో = యమునా నదికి పుష్కరము
5. సింహ రాశి యందు ప్రవేశించినచో = గోదావరి నదికి పుష్కరము
6. కన్యా రాశి యందు ప్రవేశించినచో = కృష్ణవేణీ నదికి పుష్కరము
7. తులా రాశి యందు ప్రవేశించినచో = కావేరీ నదికి పుష్కరము
8. వృశ్చిక రాశి యందు ప్రవేశించినచో = భీమరథీ (భీమా) నదికి పుష్కరము
9. ధనూ రాశి యందు ప్రవేశించినచో = పుష్కర వాహినీ నదికి పుష్కరము
10. మకర రాశి యందు ప్రవేశించినచో = తుంగ (భద్రా) నదికి పుష్కరము
11. కుంభ రాశి యందు ప్రవేశించినచో = సింధు నదికి పుష్కరము
12. మీన రాశి యందు ప్రవేశించినచో = ప్రణీతా నదికి పుష్కరము

మొదటి 12 దినములూ; చివర పన్నెండు దినములు పుష్కర పర్వదినములు ఆయా రాశులలో బృహస్పతి ప్రవేశించిన సమయములలో సర్వ మహర్షులూ ఆ జలముల యందు ఆవహించి వుందురు. ఆ సమయమున పితృదేవతల ఉత్తమ లోకగతులకై చేయు స్నాన - దాన - పిండ ప్రదానములు మున్నగునవి పితరులకు అక్షయ పుణ్యఫలములను కల్పించును. (20.4.1995)

## ❄ కొబ్బరికాయ; పీచు ❄

ప్రశ్న :- కొబ్బరికాయను భగవానునకు నివేదించునపుడు శిఖ (పీచు) వుండవలెనా? లేక తీసివేయవలెనా?

సమాధానము :- శ్రీకౌశిక ప్రోక్త కారికా-

శ్లో. అపవిత్ర మయోగ్యంచ పూజనే చ నివేదనే!
శిఖా హీనం సదా వర్జ్యం నారికేళం సురాఽలయే.

తా. శిఖ (పీచు) లేని కొబ్బరికాయ అపవిత్రమూ - అయోగ్యమూ అగును! అందువలన భగవదాలయమునందు జరుగు పూజలయందునూ; నివేదనకాలమునందునూ పీచులేని కొబ్బరికాయను విధిగా వదలిపెట్టవలెను.

''శిఖావిహీన నారికేళం భగవన్నివేదనార్థం అయోగ్యం''

తా. శిఖ హిందువులకు పవిత్రమైనది! అగ్నిని కూడా (శిఖి) శిఖ కలిగిన వానిగానే పిలుస్తారు శిఖ వుండిన భక్తులను సంసార సముద్రంలో మునిగిపోకుండా - భగవానుడు 'శిఖ' పట్టుకొని పైకి తీసి ఉద్ధరిస్తాడు! అందుకని, భక్తులగు హిందువులకూ, కొబ్బరికాయకూ 'శిఖ' విధిగా ఉండి తీరవలెను!

❁ తములపు ఆకులూ - పోకలూ ❁

ప్రశ్న :- తాంబూలము భగవానునకు గానీ; పెద్దలకుగానీ ఇచ్చునపుడు ఆకులూ - పోకలూ ఎన్నెన్ని వుండవలెను? ఎట్లు ఇవ్వవలెను?

సమాధానము :- ప్రాచీన కారికా.

శ్లో. ఏక పూగం మహా పాపం; ద్విపూగా న్నిష్ఫలా భవేత్!
త్రిపూగాన్ సుఖ మాఽప్నోతి; తస్మా త్పూగత్రయం శుభమ్.

తాంబూలమునందు -

తా. ఒక వక్క (పోక చెక్క) పెట్టినచో - మహాపాపము కలుగును
రెండు పోకలు పెట్టినచో - ఫలము నశించును!
మూడుపోకలు పెట్టినచో - సుఖమూ - శుభమూ ప్రాప్తించును;

★ తములపు ఆకులు మాత్రము సరి సమాన సంఖ్యలో వుండినచో - సమఫలము లభించును!

విషమ (బేసి) సంఖ్యలో వుండినచో - విషమ ఫలము ప్రాప్తించును!





❁ కర్పూర నీరాజనము ఫలము ❁

ప్రశ్న :- కర్పూర నీరాజనము వలన ఫలము ఏమి?

సమాధానము :- (నారదీయ సంహితా)

శ్లో. మంత్రహీనం, క్రియాహీనం, యత్ కృతం పూజనం హరేః,
సర్వం సంపూర్ణతామేఽతి కృతే నీరాజనే హరేః!

తా. శ్రీ నారద మహర్షి ఇట్లు తెలిపెను -

భగవత్ పూజయందు తెలిసి కానీ; తెలియక కానీ చేయునటు వంటి మంత్రలోపమూ, క్రియాలోపమూ -(ద్రవ్యలోపమూ - భక్తి లోపమూ) మున్నగు లోపములు అన్నియునూ కర్పూరముతో గానీ, ఆవునేయితో గానీ, నూవుల నూనెతో గానీ తడిపిన వత్తితో నీరాజనము వెలిగించి భగవానుని రెండు నేత్రములకు సమానముగా మాత్రమే చూపవలెను -

★ నేత్ర ద్వయమునకు కాక; భగవానుని చుట్టునూ త్రిప్పినచో కులక్షయమగును! (విష్ణుతిలకసంహితా)

❁ భగవద్దర్శనము ❁

1) భగవదాలయమునకు చేరగానే భక్తుడు గంటను మూడుసార్లు మ్రోగింపవలెను.

2) దండవత్(కర్రవలె) బోరగిల పడి -

శ్రీపద్మసంహితా -

శ్లో. పద్భ్యాం- కరాభ్యాం- జానుభ్యా మురసా- శిరసా- దృశా
మనసా - వచసా చైవ ప్రణామోఽష్టాంగ ఉచ్యతే.

తా. 1. పాదములు రెండునూ, 2. చేతులు రెండునూ, 3 మోకాళ్లు రెండునూ, 4 ఎదుఱు ఱొమ్ము 5. శిరమూ 6. చూపులూ 7. మనసూ 8. వాక్కూ - ఈ ఎనిమిది అంగముల తోడనూ (దండము అనగా - కఱ్ఱ వలె పడి) చేయునది సాష్టాంగ నమస్కారము! నేలపై బడి మాత్రమే నమస్కారము ఎందుకు చేయవలయును ? అనగా పద్భ్యాం భూమిః అని శృతి చెప్పుచున్నది. పరమాత్మ యొక్క పాదములే భూమి అని ప్రమాణ వచనము. కనుక పరమాత్మ పాదములపై ప్రత్యక్షముగా పడి నమస్కరించిన అటువంటి ఫలితము భక్తులకు ప్రాప్తించును.

నమస్కరించి లేచునపుడు భగవానుని పాదములనుండి - కిరీటము చివరవఱకునూ (పాదాఽది కేశాఽన్తమ్) చూచిన భక్తులకు ఊర్ధ్వలోక (విష్ణుపద) ప్రాప్తి కలుగును!

హరిః ఓమ్ తత్ సత్!



శ్రీ పాంచరాత్రదివ్యాగమ గ్రంథములు :

1. శ్రీపాంచరాత్ర అర్చక రక్ష
   ఇది అర్చక విజ్ఞా న సర్వస్వము. ఇటువంటి గ్రంథము ఇంత వరకు ఎవరునూ వ్రాయలేదు, ప్రచురింపలేదు! ఆంధ్ర - తమిళనాడు - కర్ణాటక - ఒరిస్సా - మహారాష్ట్రములలో పేరొందినది!
2. శ్రీ వీరలక్ష్మి శరన్నవరాత్ర వైభవము 1వ భాగము
3. శ్రీ విజయదశమీ 2వ భాగము
   మహిషాసురుని ఎవరు చంపారో? మీకు తెలుసా?
   దుర్గాదేవి అనుకొంటున్నారు కదూ?
   అది తప్పు! మహాలక్ష్మీదేవి చంపింది! శైవ, పాంచరాత్ర (వైష్ణవ) శాస్త్రప్రమాణాలతో నిస్సంశయంగా నిరూపించబడింది!
4. శ్రీకృష్ణ జయన్తి
   శ్రీకృష్ణుడు అష్టమి నాడు పుట్టాడని మీరనుకుంటూవుంటారు! అంతేకదా? అదితప్పు! 'నవమీ తిథిలో పుట్టెద'నని విష్ణువే వైకుంఠములో యోగమాయకు చెప్పాడు. అనేక శాస్త్ర ప్రమాణాలతో గల గ్రంథము!
5. కృష్ణం వందే జగద్గురుమ్
   శ్రీ కృష్ణ జననము(సప్రమాణము) సంపూర్ణ (745 శ్లోకములు కలిగిన) భగవద్గీతా; విష్ణు సహస్రనామ స్తోత్రములతో అనేక విశేషములతోకూడినది
6. శ్రీమన్నారాయణార్చనా కల్పవృక్షము
   పురుషుడెవరు? పురుషసూక్తారాధనము. విష్ణుసహస్రనామ మూలము. శ్రీనారాయణోపనిషత్తు ; విష్ణువును ఎందుకు పూజించాలి!
   అనేక ప్రశ్నలకు సమాధానాలు దీనిలో వున్నవి!
7. శ్రీ విష్వక్ సేన పూజ
8. వంగిపుర చరిత్ర మరియు పంపమహాకవీ; నాగవర్మలచరిత్ర
9. శ్రీ దిట్టకవి వారి శ్రీ లక్ష్మి వాస్తు వైభవము (త్వరలో)
   (మానవగృహ వాస్తు;దేవాలయ వాస్తు లు దీనిలో కలవు)

---

సూచన: గ్రంథముల వెలలకై వ్రాయండి ! గ్రంథముల వెలలు ముందు పూర్తిగా పంపినవారికి పోస్టలు ఛార్జీలకు వి.పి.పి. బుక్‌పోస్టు ద్వారా పంపెదము!